శ్రీః

ఓం శ్రీవరాహలక్ష్మీ నృసింహ పరబ్రహ్మణేనమః



# ★★★గుమాస్తా

(సాంసారిక వచన నాటిక)

కృతికర్త

చరిత్ర చతురానన,

పండిత, గంటి సూర్యనారాయణశాస్త్రిగారు.

ప్రకాశకులు :

శ్రీ వాసిరాజ విద్యాపీఠము

సింహాచలం

శ్రీః

ఓం శ్రీవరాహలక్ష్మీ నృసింహ పరబ్రహ్మణే నమః

# గుమాస్తా

( సాంసారిక వచన నాటిక )


కృతికర్త :

చరిత్ర చతురానన,

పండిత, గంటి సూర్యనారాయణశాస్త్రిగారు.



ప్రకాశకులు :

శ్రీ వాసిరాజ విద్యాపీఠము

సింహాచలం

శ్రీః

ఓం శ్రీ వరాహ లక్ష్మీ నృసింహ పరబ్రహ్మణేనమః

# గుమాస్తా

(నాటిక)

## 1 వ రంగం

•••○○○•••

(తెరలో — వందేమాతరం — భారతమాతకూజై,
గాంధీ మహాత్మాకూ జై.)

మణిప్రవాళం :— తండులాలు గృహమందు నసంతి
తిండికైతె పదిమంది వసంతి
కుండలన్ని గృహమందు లుఠంతి
ముండనాకొడుకులెల్ల హసంతి.

[ అని చదువుకుంటూ వీధి అరుగుమీద వాలుకుర్చీలో సుందరరావు కూర్చుంటాడు. పొడుం పీలుస్తూ ఇటువేపూ అటువేపూ చూస్తూవుంటాడు. దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటాడు. కుర్చీలో కూర్చుని, చేతిలో బుర్ర పెట్టుకుని విచారిస్తూ వుంటాడు. ]

కాంతం :— ( ఇంట్లోంచి ) యేమండోయి — ఇదిగో — యేమండీ ! మీారే — ఇదో — ఇలాచూడండీ ! వోయ్ — ఇలా వస్తారూ !

సుందరరావు :— యేమిటే నీగోల ? కొంప మునిగి పోయి నట్టు గుక్క విడవకుండా పిలుస్తున్నావు ? యేం, యేమిటో చెప్పు ?

కాంతం :— యెందుకండీ అంతకోపం ! యేమీ లేదు. మీకు వినపడిందో లేదో అని రెండుసార్లు పిలిచేను. అందుకేనా యింతకోపం, చిరాకున్నూ. బాగుంది. యెలాబతికే దీకొంపలో ? ఇకపైని పిలవనే పిలవను. నాకేం, అంతపిలిచి చీవాట్లు తినే దాకా. నామానాన్ని నేను హాయిగా కాళ్లు చాచుకొని కూర్చుంటాను. యేం తింటారో తినండి.

సుందర :— యేమిటా సణుగు ? అడిగితే చెప్పవ్.

కాంతం :— అడిగే విధంగా అడిగితే యెందుకు చెప్పను ? కళ్ళెర్రజేసి, చర్రుమని బుస్సుకొడుతూ వచ్చి, చెప్పమంటే యేం చెప్పను ?

సుందర :— లేదులే. శాంతంగానే అడుగుతున్నాను — యేమిటో చెప్పు, వేగం వెళ్ళాలి.

కాంతం :— యేమీలేదు. ఇంట్లో నలుగురున్నాంకదా ! మొన్న 9 రు. యిచ్చి తెచ్చిన 8 శేర్లబియ్యం నిన్నే అయిపోయాయి. ఇవాళ కొక్కగింజైనా లేదు. పప్పులు తేవాలి — చింతపండు కొంటారుకాదూ ! అన్నంగిన్నె కన్నం పడి పోయింది. మాట్లవాడి కిస్తుంటారా ? మీరు వచ్చేటప్పుడు విస్తళ్లు తెస్తేచాలు. అన్నట్టు మరచిపోయాను. పొరుగు

వారికి మిరపకాయ లివ్వాలి. చాలారోజు లైపోయింది. అడక్క అడక్క నిన్నడిగేరు. ఇంకా మీరు బయలుదేర లేదుకదా ! వుప్పు, నూనె, కర్రలతో వంపీయండి. ఇవన్నీ వస్తేనేగాని ముద్ద విస్తల్లోకి రాదు. ఈసంగతి చెప్పడానికి, పిలుస్తూవుంటే వినిపించుకోక నామీద కోప్పడతారు. అప్పో— సాప్పోచేసి, యింత యేదో వుడకపెట్టిపెడితే — అన్నంలోకి యేమీ లేదని విసవిసలాడుతూ విస్తరితీసి నా మొఖాన రుద్దుతారు. ఆడదాన్ని నేనేం చేసేది? నాలుగు సామానులూ తెచ్చి పడేస్తే — వండిపెడతానుగాని, నేనువెళ్ళి తేలేనుగదా !

సుందర :— చాలుచాలు సిలెచ్చరు. నిన్ను తెమ్మని యెవరు చెప్పేరు? యేం సామాన్లుకావాలో చెపితే తెచ్చేవాణ్ణి నే నున్నాను కదూ ! ఇందుకేనా యింత రాద్ధాంత సిద్ధాంతాలు.

కాంతం :— రాద్ధాంత సిద్ధాంతాలు కావండీ ! మెల్లిగా వోసారి చెపితే వినిపించుకోరు. ఇంకోసారి చెపితే లెచ్చరిస్తున్నానంటారు. యెలా యేడ్చేది? నావల్ల కాదమ్మా. నాకోసం తెమ్మన్నట్టుంది. మీ అందరికీ వుంటే నాకూ వుంటుంది. మీకు లేకపోతే నాకూలేదు. ఇకపైని నేను చెప్పడమే మానేస్తా. మీ యిష్టానుసారం చేసుకోండి.

(అని గిరుక్కున తిరిగి యింట్లోకి పోవుచుండును)

సుందర :— కాంతం! కాంతం! ఇలారా. ఎందు కంత కోపం? కూర్చో — వో మాట చెబతాను. శాంతంగా విను.

ఇంట్లో అన్నిసామాన్లూ నిండుకున్నాయని నాకూ తెలుసు. యేం చేసేది? యెంత డబ్బు తెచ్చినా చాల్లేదు. ప్రతీ సామానూ అడ్డకు పడ్డగా పెరిగిపోయింది. జీతం నలభై రూపాయీలు ఆఫీసుగేటు దాటవుకదా! అప్పులసామి అప్పు అలాగేవుంది. వూళ్ళోమాత్రం యెంతని అప్పు వుడుతుంది? నేను కాబట్టి, కిందామీదాపడి, మసిపూసి మారడికాయ చేసి యెలాగో అలాగ యీ సంసారాన్ని యీదుతున్నానుగాని, మనక యేఖర్చు యింకో గుమాస్తాకైతే, యీపాటికి మలమల మాడిపోయి మంగళం పాడివలసిందే!

శాంతం :— వాళ్ళ కయేఖర్చు వాళ్ళకవుతున్నాది. మన కయేఖర్చు మన కవుతున్నాది. యెవరూ పంచభక్ష్యాన్నాలూ తినీలేదు, చచ్చిపోనూలేదు. గాని, యేకభుక్తాలూ — రాత్రి ఫలహారాలూ గుమాస్తా లందరికీ గుడిలోని దేవుడు రాశాడు. అనుభవిస్తున్నాం. చాలామట్టుకు మనయింటిని తీసిపోదు యే యిల్లున్నూ. కొంతమందికి పైరాబడివుంటే వుండవచ్చు. అది మనకులేదు. మొత్తంమీద గుమాస్తా జాతంతా వొక్కలాగే వుంది. సరేలెండి. వాళ్ళగోల మనకెందుకు? నన్నెందు కుండమన్నారో చెప్పండి. పొద్దెక్కిపోతున్నాది.

సుందర :— అప్పులవాళ్ళ బాధ చాలాయెక్కువగా వుంది. వూళ్లో తలెత్తి తిరగలేకుండా వున్నాను. వాళ్ళందరూ ఇంటి దగ్గిరా, బైటా, నానామాటలూ ఆడుతున్నారు. వొక్క

రూపాయైనా యీవ్వాళ్లో అప్పుపుట్టదుకదా! యెలా బతకడమో పాలుపోకుండావుంది. యీ నాల్గురోజులూ గడిస్తే, వొచ్చేనెల్లో ఫరవాలేదు. మనవాడికి వుద్యోగం అవుతుంది. కొంతలోకొంత నయంకదా!

కాంతం :— సరే! బాగుంది మీ ఆలోచన. నన్నేం చేయమంటారు?

సుందర :— యేమీలేదు. నీ ... మెళ్లో ... మంగళ సూత్రాలు ...

కాంతం :— ఇదా! చాల్లెండి. యింతసేపూ కూర్చో పెట్టి ... మనదరిద్రం యెప్పుడూ యిలాగేవుంటుంది. గుమాస్తా గిరి సంపాదించి యేంబావుకున్నాం? కట్టగుడ్డ—తినతిండి లేక, కట్టుకాసులపేరూ—వడ్డాణ్ణం—చేతిగాజులు నాల్గుజతలూ — మా నాన్నగారు సుశీలకుపెట్టిన రెండుతులాల మెడగొలుసూ, ఇది—అది—యేమిటి? బంగారంఅంతా వొలిచేసి, వుస్తెలతో నడి వీధిలో నిలబెట్టేరు ఇవికూడావుండడం మీకిష్టంలేనుకాబోలు.

సుందర :— అదికాదే! అబ్బాయికి వొచ్చేనెల్లో వుద్యోగం కాగానే, తులంబంగారంపెట్టి రూపాయంత వుస్తెలు రెండు చేయిస్తాను. యెప్పుడూ యిలాగే వుండిపోతామా? మంచి రోజులు వస్తాయి.

కాంతం :— యేంవస్తాయో? కాని, యిప్పుడు వీటికి గాలి వచ్చింది. అదుగో—! తెల్లవారిందో లేదో ఇదిమొదలు అప్పు

లాళ్లకు జవాబుచెప్పేసరికి నాజివ్వావడిపోతున్నాది. ఆనూని వాడి కేదోచెప్పి పంపించండి. వస్తాను.

సుందర :— వాటిని కాగితంలో పొట్లాంకట్టి, నాకోటు జేబులోపెట్టు.

( కాంతం వెళ్లిపోవును )

( నూనెకావడితో తెలకలివెంకన్న ప్రవేశించును )

వెంకన్న :— యేంబాబు! నన్ను మరచిపోయారు.

సుందర :— వెంకన్నా! ఇలారా! కూర్చో.

వెంకన్న :— బాబ్బాబ్బాబు! (అని కూర్చుండును.)

సుందర :— ఇదిగో వెంకన్నా! యిప్పాడే వుత్తరంవచ్చింది, మావాడి వుద్యోగంగురించి. నాల్గురోజుల్లో ఆర్డరువస్తుందట. మావాడికికూడా యిక్కడేవుద్యోగం అయితే, కలిసిమెలిసి అంబలో—గంజో కాచుకోని వొక్కచోటేతాగితే కొంత కలిసి వస్తుందికాదూ! ఇదిగో—ఇటుచూడూ! నిన్న స్టోర్సుమేనేజరు గారితో మాట్లాడేను. స్టోర్సుకి నూనె, నెయ్యి, చాలామట్టుకు పడుతుందట. నీవు సప్లయిచేస్తే, నాలుగుపైసాలు తింటావు. మంచిలాభం వుంటుంది. ఆ మేనేజరు యిప్పటిప్రభుత్వంలో మనిషే. అతనికనుసన్నల్లో మెలగేవా, నీసొమ్మేవడుతినను? రేపో కాగితంపెట్టు, తప్పక అవుతుంది. అన్నట్లు— రేపువద్దు. అష్టమీా, నవమీాకూడా పోనీ. దశమినాడు నాదగ్గిరకువస్తే కాగితంరాసియిస్తాను వెళ్లు. వొచ్చేనెల్లో నీబాకీ సీదాగాతీర్చివేస్తాను.

యేమీఅనుకోకు. ఇదిగో వెంకన్నా ! యిలాచూడు. వొక్క అర్ధశేరు నూనెమాత్రం యివ్వాడుయింట్లోపోసి వెళ్లు. యెల్లుండి యీసామ్ము యిచ్చేస్తా. పాతదాల్లో కలపొద్దు.

వెంకన్న :— చిత్తం. (అని నిష్క్రమించును.)

## 2వ రంగం

[ వాలంటీర్లు జండాలను, గాంధీటోపిలను ధరించి, పాడుతూ ప్రవేశింతురు. ]

మోసం మోసం దేశం మోసం
దేశంలోని ప్రజలే మోసం
రోసంతోటీ మీసం దువ్వే
ఆకలిమంటల నార్పండీ —
కరువును బయటికి తరమండీ — మోసంమోసం...
తూచేగుండూ — కొలిచేకుంచం
లంచంలోనే మునిగిందీ —
చీకటిబేరం చేసిందీ — మోసంమోసం...
కట్టుగుడ్డకీ — కడుపుతిండికీ
కరువును తెచ్చిన — కర్కశవర్గం
మోసం మోసం అంతా మోసం

దేశంలోని ప్రజలే మోసం
రోసంతోటి మీసందువ్వి
ఆకలిమంటల నార్పండి
కరువునుబయటికి నెట్టండి! మోసం...

(అని పాడుతూ మీటింగులోకి వస్తారు. రామశాస్త్రి అధ్యక్ష పీఠాన్ని అధిష్ఠించి ఉపన్యసిస్తూ వుంటారు.)

రామశాస్త్రి :— సోదర సోదరీమణులారా! మనంయిచ్చట సమావేశం అవడం తిండిగింజలకోస మని మీఅందరికీ తెలిసిన విషయమే. మనభారతదేశాన్ని అనుదినం కబళించేస్తూన్న యీ కరువుకాటకపిశాచాన్ని పారదోలాలి. ఆకలిమంటలను చల్లార్చాలి. మనప్రభుత్వంవారు కరువు నివారణకోసం చాలా మట్టుకు పాటుపడుతున్నారు. గాని, దిగువ అధికారుల స్వార్థ పరత్వము అడ్డుతగులుటచేత కరువుతరగలేదు. మనదేశంలో పండినపంట మనకుచాలదనిన్నీ—విదేశాలనుండి తెప్పించడానికి స్టీమర్లు, డబ్బు, లేకపోవడమే గాక, యింకాకొన్ని యిబ్బందులు కలవనిన్నీ, మనప్రభుత్వంవారు మనకు సాకుచెప్పి. తచ్ఛాంతికై నవధాన్యాలు, తొమ్మిదాన్సులిచ్చి, పోషిస్తున్నారు. చావకుండా, బ్రతక్కుండా, వున్నాము. ఇంతేకాదు. అధిక ఆహారోత్పత్తికిగాను, మీటింగులపై మీటింగులను జేసి కొత్తగా మహానదులకు కాలువలు తవ్విస్తారట — వ్యవసాయ యంత్రాలను తయారుచేస్తున్నారట — భూములను కొలుస్తున్నారట—ప్లానులను తయారు చేయడానికి ఇంజనీరింగు

కాలేజీలను పెడుతున్నారట — కరెంటు కోసం వాటరు ఫాల్సుని పరిశీలిస్తున్నారట — వర్షంకోసం చెట్లను నాటుతున్నారట — రామపాద సాగరాది ప్రాజెక్టులకోసం సిమ్మెంటు ఫేక్టరీలను పెట్టబోతున్నారట — జొన్నలు, గంటెలు, వేరుశనగ, దుంపలపిండి చాలా బలమైన ఆహారమని, పెద్ద పెద్ద కాగితాలు, పుస్తకాలు అచ్చువేసి ప్రచారంకోసం పంచిపెడుతున్నారట — పశువులు తినే వాట్టికడ్డిలో 'ఎ' విటమిన్సు వుంటాయని పరిశోధనలు చేస్తున్నారట — సాధ్యమగునంత త్వరలోనే అనగా 1999 సం. నాటికి మనస్వతంత్ర భారత దేశాన్ని స్వయంసమృద్ధంగా పనిచేయడానికి ప్రతిదినం విమానాలమీద మనమంత్రులు తిరుగుతున్నారట — వొక్క 50 సంవత్సరాలు వోపికపడితే, తగువాళ తప్పక పూర్తి సేవను యిస్తారట — ఇది మనప్రస్తుత ప్రభుత్వముగారి కొత్తస్కీముట —

(సభలోంచి) ఇదంతా చాలాబాగుంది. గాని లేంటి మన సంగతేమిటండీ ?

రామశాస్త్రి :— మనసంగతా ! పల్లెల్లో కంట్రోలు తీసేశారుకదా ! హిరణ్యాక్షవరాలతో జిల్లాకంట్రోలు రద్దు చేసేమన్నారు. ఇక మనకేం ? కంట్రోలు సమయంలో శేరు 0—11—0 బ్లాకులో దొరకేవి. ఇప్పుడు రెండు కంట్రోళ్లు తొలగించి, పబ్లిగ్గా శేరు 1—4—0 అమ్మిస్తున్నారు. డబ్బుండి, బియ్యం దొరికితే కొనుక్కోవడమే. దీనంతికీ యెవరు కారకులని మీ అభిప్రాయం ? బల్లలు తుడిచే బిళ్ళబంట్రోతు మొదలు బుద్ధిబలంతో పరిపాలించే పార్లమెంటు మంత్రులవరకూ గల

సిబ్బందే అని నమ్మండి. ప్రభుత్వోద్యోగులకు కంట్రోలు బాధలేదు — వర్తకులకు లేదు — రైతులకు లేదు — ధనికులకు లేదు — అనాధులమైన మధ్యరకం మనబోటివారినే, యీ కరువు కాటకాలు పీల్చి పిప్పి చేస్తున్నాయి.

( సభనుండి నిజం నిజం వినండి వినండి అని కేకలు )

మహాజనులారా! మన తిండిగింజల కోసం మహమందరమూ యిప్పుడు యేకమై, దృఢదీక్షతో ప్రభుత్వానికి వొత్తిడి కలిగిస్తే, రైతుల యిళ్ళల్లోనూ, కళ్ళాల్లోనూ, వర్తకుల గిడ్డంగుల్లోనూ వున్న తిండిగింజలు బైట పడతాయి. అప్పుడందరికీ, చవగ్గా — సరఫరా కావచ్చు.

"అమ్మో! చచ్చి పోయాను"

( అని తలపట్టుకొని సుందర్రావు నేలపై పడిపోవును. పట్టుకోండి-తన్నండి — వదలకండి — డాక్టరుని పిలవండి — సోడాయివ్వండి — యేమిటి? యేమిటి? దెబ్బతగిలిందా? పాపం. కూర్చోండి-కూర్చోండి. గాలి రానీయండి అని సభలో కోలాహలం )

రామశాస్త్రి :— కూర్చోండి. మాట్లాడకండి. వొక్కమాట చెప్పి సభముగిస్తా. యెవడో లంచగొండి, స్వార్థపరుడు, దేశద్రోహి, నాకు తగలాలని రాయి విసిరేడు. అది పాపం సుందర్రావుగారి బుర్రకు తగిలింది. తల పగిలింది. రక్తం కారుతున్నాది. డాక్టరుగారిని పిలవండి.

నమస్తే! భారత మాతకూ జై.

( నిష్క్రమింతురు )

# 3 వ రంగం

....o O o....

[ డాక్టరుగారి యిల్లు ]

వెంకటేశం :— డాక్టరుగారూ! డాక్టరుగారూ!

డాక్టరు :— యెవరది?

వెంకటేశం :— నేను సార్. ఇల్లిక్కడ మంటపం దగ్గిర, తిండిగింజలకోసం మీాటింగు జరుగుతూవుంటే, యెవడో తుంటరి ప్రెసిడెంటుగారిమీాదికి రాయి విసిరేడుసార్. అది సభలోవున్న సుందర్రావుగారికి తగిలి, తల పగిలిపోయింది సార్. రక్తం ధారగా కారిపోతున్నాదిసార్. వొక్కసారి దయచేయాలిసార్.

డాక్టరు :— ఇప్పుడు నేను రాలేను. పొద్దున్నుంచీ యేం చేస్తున్నావు? 9 నుండి 11 గం. వరకూ ఆసుపత్రిలోనే వున్నాను. ఇప్పుడు వీల్లేదు.

వెంకటేశం :— ఇప్పుడేసార్. 12 గంటలకి తల పగిలింది సార్. వొక్కసారి దయచేయండిసార్.

డాక్టరు :— అయిదురూపాయీలు ఫీజుపట్టుకురా. వస్తాను.

వెంకటేశం :— తిండిగింజలకోసం మీాటింగులోకి వెళితే దెబ్బ తగిలిందిసార్. అతడు యీావూళ్ళో గుమాస్తాగా వున్నాడుసార్. చాలా బీదవాడు. కష్టంలో వున్నాడుసార్.

డాక్టరు :— నా దగ్గిరికి వచ్చేటప్పటికి అందరూ బీదవాళ్ళవుతారు. కష్టంలోనూ వుంటారు. ఫీజు, ఫీజు?

చంద్రుడు :— (ప్రవేశించి) యేమిరా వెంకటేశం డాక్టరుగా రున్నారా, లేరా?

వేంకటేశం :— వున్నారా. 5/-రు ఫీజు యిస్తేనేగాని రానంటున్నారు.

చంద్రుడు :— సంగతంతా చెప్పావా?

వెంకటేశం :— చెప్పకేం, బతిమాలుతున్నాను కూడాను.

చంద్రుడు :— సరే, నువ్వువెళ్లు జట్కామాట్లాడి సుందరరావుగారిని ఆసుపత్రికి తీసుకురా? నేను డాక్టరుగారిని తీసుకు వస్తా!

(వెంకటేశం నిష్క్రమించును)

చంద్రుడు :— డాక్టరుగారూ! ఇవిగో 5/రు. దయచేయండి.

డాక్టరు :— ఆ టేబులుమీద పెట్టు. ఆసుపత్రికి పద. వస్తాను.

(ఆసుపత్రిలో రామశాస్త్రి, చంద్రుడు, వెంకటేశం యింకా కొంతమంది సుందరరావును చూస్తూవుంటారు.)

రామశాస్త్రి :— డాక్టరుగారూ! ఈ దెబ్బ నాకు తగలవలసిందండీ. పాపం ఈ బీదబ్రాహ్మడికి తగిలింది. ఇతడు ప్రజలకోసం, దేశంకోసం పాటుపడే మనిషి. ఇతనికేం ఫరవాలేదు కదండీ?

డాక్టరు :— దెబ్బ నసాళంమీద బాగా మోపుగా తగిలింది. ఫరవాలేదు. ఇప్పుడు కట్టుకట్టేను. చీటి రాసిస్తాను,

మందులుకొని రేవు తీసుకురండి. ఆ మందులు వేస్తేనేగాని లాభంలేదు. చాలా ప్రమాదస్థలంలో తగిలింది దెబ్బ.

చంద్రుడు :— పెద్దపేరుపొందిన ఆసుపత్రికదా! మందులు లేకపోవడం యేమిటండీ!

డాక్టరు :— లేవు కాబట్టి, లేవు. రామశాస్త్రిగారూ! మందులు యీవూళ్ళో దొరుకుతాయి. వొకవేళ లేకపోతే వాటిఖరీదెంతో కనుక్కొనివస్తే ఆఖరీదుకు నేనే యిస్తా.

చంద్రుడు :— అదా సంగతి డాక్టరుగారూ! ఆసుపత్రి మందులు మీాయింట్లో వున్నాయన్న మాట.

డాక్టరు :— ఆసుపత్రిమందులుకావు. నా స్వంతమందులు.

చంద్రుడు :— అదేనండి. ఆసుపత్రిరోగుల కుపయోగించే మందులు.

రామశాస్త్రి :— డాక్టరుగారూ! అతనితో యేమిటి? ఈసుందరరావుగారిని ఆసుపత్రిలో అడ్మిట్ చేసుకోండి. చాలా పేదవాడు. రోజూ ఫీజు యిచ్చుకోలేడు. జట్కాకట్టించుకుని కూడా రాలేడు.

డాక్టరు :— ఇవాళయింటికి తీసుకుపొండి. మందులుకొని రేవు తీసుకువస్తే చూసి చెబతాను.

ఆచారి :— (ప్రవేశించి) డాక్టరుగారూ! నమస్కారం.

డాక్టరు :— ఆఁ! యేంకావాలి.

ఆచారి :— మానాన్నగారికి యీమధ్య చాలా జబ్బు చేసిందికదండీ! మీారే చాలారోజులు, చాలామందులుకొనిపించి

యిచ్చేరు. మాదురదృష్టంవల్ల వారు మీా చేతుల్లోనేపోయారు. వారు భీమాకంపెనీలో పోలసీతీసుకున్నారు. ఇప్పుడు ఆ కంపెనీ వారు, "మానాన్నగారు జబ్బుతో చనిపోయినట్లు డాక్టరు సర్టిఫికెట్టును పంపమన్నారండి."

డాక్టరు :— యెంతసొమ్ముకు భీమాచేసేరు ?

ఆచారి :— రెండువేలకండి.

డాక్టరు :— అయితే 25 పర్సెంటు. అంటే 500 రు. మాకు ఫీజు యివ్వాలి.

ఆచారి :— మరేమీా అక్కర్లేదండి. అతడు మా ఆసుపత్రిలో ఫలానాజబ్బుతో—ఫలానారోజున చనిపోయాడు" అని మూడుముక్కలు రాసిస్తే చాలునండి.

డాక్టరు — అదేనయ్యా ! అదే ! ఆమూడుముక్కలు వ్రాయడానికే పోలసీ మొత్తంలో నాలుగోవంతు యియ్యాలి. మీాకు రెండువేలు వస్తున్నప్పుడు 500 ఇవ్వడానికి కష్టంగా వుందా ? ఫీజుయిస్తేనేగాని సర్టిఫికెటు యివ్వబడదు !

చంద్రుడు :— (రామశాస్త్రితో) చూశేరూ ! డాక్టరుగారు, 500 రూ. లంచం తెమ్మంటున్నారు ఆచారిని.

డాక్టరు :— లంచంకాదండీ ! ఫీజు.

చంద్రుడు :— అవునవును ఫీజే. ప్రభుత్వోద్యోగస్థులు, శాసనసభాసభ్యులు, మంత్రులు పుచ్చుకున్నవి బహుమానాలు. వకీళ్ళు, డాక్టర్లు, పుచ్చుకున్నవి. ఫీజులు. మాన్యులు కరణాలు,

రివిన్యూయిన్స్పెక్టర్లు వుచ్చుకున్నవి మామూళ్లు. పోలీసులు బిళ్ళ బంట్రోతులు పుచ్చుకున్నవి లంచాలు. అంతేనా ?

రామశాస్త్రి :— చంద్రుడూ ! రా పోదాం. డాక్టరు గారూ ! సెలవండి.

డాక్టరు :— మంచిది.

( నిష్క్రమింతురు )

---

## 4 వ రంగం

[సుందర్రావు నులకమంచంమీద కూర్చుని కాఫీతాగుతూవుంటాడు. కాంతం, సుశీల, శంకర్రావు. సోగమ్మ, పిల్లడు మంచందగ్గర వుంటారు.]

కాంతం :— కొంచెం నింపాదిగావుందా ? రాత్రంతా బాధపడుతూనే వున్నారు. మీరెందుకు వెళ్ళేరండీ, ఆవెధవ మీటింగుకి ? గ్రహచారం. మీరు రెప్పటికీ యింటికిరాకపోతే, ఉద్యోగానికి వెళ్ళిపోయారు కామోసనుకున్నాను. పిల్ల లాకలితో చుట్టుకుపోయారు. నిన్న, మీ జేబులో పెట్టిన పొట్లాం యిచ్చేసి, డబ్బుపుచ్చుకున్నారా ? లేదా ?

సుందర్రావు :— లేదు.

కాంతం :— ఏమిటిలేదు ?

సుందర :— పొట్లాం లేదు. యెక్కడోపోయింది.

కాంతం :— ఆఁ! పోవడమే! – అనుకున్నంతా అయింది. మనింటికి శనిపట్టింది. దరిద్రదినాలు దాపరించేయి. జేబులో పెట్టిన పొట్లాం యెలాపోయిందండీ?

సుందర్రావు :— బజారుకు వెళ్లి చూపించి, తూపించేను. అరతులంవుంది. 20 రు. యిస్తామన్నారు. ఇంత ఘోరమా! అని తీసుకుని, జేబులో పెట్టుకుని, మీటింగులో కూర్చున్నాను. ఫట్టుమని దెబ్బతగిలింది. తలపగిలింది. పడిపోయాను. నిన్న సాయంత్రం జేబుచూచాను. జేబులో లేదు.

కాంతం :— ఆదిక్కుమాలిన మీటింగు మనకోసమే వచ్చినట్టుంది.

సుశీల :— అమ్మా! పోయిందేదో పోయింది. వూరుకుందు.

కాంతం :— యేదోపోవడమేమిటే? అరతులం బంగారం మంగళసూత్రాలు. ఈకాలంలో మళ్ళీ బంగారం కొనుక్కోగలమే. ఇంట్లోనూ, వొంట్లోనూవున్న పిసరూ, పిప్పీ వూడ్చేసి యిచ్చేసేను. దాన్ని తాకలపెట్టేవరకూ మీనాన్నగారికి నిద్దర పట్టలేదు. ఇక హాయిగా నిద్దరపోతారు. 'అతడో పెద్ద గుమస్తా గారు, వారికేం' అంటారు పైవారు. గుమస్తాలుపడే కష్టాలు గుళ్ళో దేవుళ్ళకే తెలుసు. మీనాన్నగారు మంచంపట్టేరు. నిన్నటినుండీ తిళ్లులేవు కదా! యేంపాపంచేసేమో?

పిల్లడు :— అమ్మా! అమ్మా! అన్నంపెట్టే, ఆకలే.

సుందర్రావు :— హా! భగవంతుడా!

కాంతం :— భగవంతుడెవడు ? భగవంతుడు. యిలాంటి సమయంలోకూడా రక్షించని భగవంతుడు మనకెందుకు ? మనం, మనమేమిటి ? మనబోటివాళ్ళు లక్షలూ, కోట్లూ, దిక్కూ మొక్కూ లేక, అన్నం, గుడ్డా లేక, ఆలించి పాలించేవాళ్ళులేక యేడుస్తూవుంటే, యేంచేస్తున్నాడా దేవుడు గుళ్ళల్లో ? ఆచార్యులర్పించే పులిహోర, పొంగలీ, దధ్యోదనం మింగుతున్నాడా? పూజార్లుచేసే పూజలకు పొంగి తబ్బిబ్బైపోతున్నాడా ? భక్తులిచ్చే పట్టుపీతాంబరాలు, బంగారునగలూధరించి, 'తింగురంగా' యని వొయ్యార మొలికిస్తున్నాడా ? లేక నాగరికులిచ్చే నవనవ సుగంధాలలో వూపిరాడక వుక్కిరిబిక్కిరిఅయిపోతున్నాడా? భగవంతుడు! భగవంతుడు! ఛా! మనబోటివారికి భగవంతుడు లేనేలేడు. ఎన్నాటికీలేడు-నిజంగాలేడు. వుంటే; - ఉదయం 8 గంటలనుండి, సాయంత్రింవరకు ఆకలితోకూర్చుని పనిచేసిన గుమాస్తాల కీయవస్థ యెందుకుపడుతుంది ?

సుందర :— కాంతం! కాంతం! శాంతించు. "నుదుటన్ వ్రాసినవ్రాత తప్పదుగదా నూరేండ్లు చింతించినన్" మనంపెట్టి పుట్టలేదు. కర్మ అనుభవింపక తప్పుతుందా ? దేవుణ్ణి నిందిస్తే యేంలాభం ?

పిల్లడు :— అమ్మా! ఆకలేస్తున్నాదే, అన్నంపెట్టే.

కాంతం :— వుండునాయనా! పెడతావుండు. అదేదో పాడుతున్నారు చూదిరా ?

పిల్లడు :— ఆకలి—ఆకలి,

వాలంటీర్లు :—

"ఆకలి ఆకలి మండే ఆకలి
వరములన్నిటిని నమలే ఆకలి
నీతి నియమముల జాతిభేదముల
పాటించొద్దనే బండఆకలి
మానవత్వమును మరపించేసి
దోపిడిగొరక్కై తోలే ఆకలి
అభిమానాన్నీ ఆశయాలనీ
సహనశక్తినీ చంపే ఆకలి
ఆకలి ఆకలి మండేఆకలి."

(అనిపాడుతూ, రామశాస్త్రి వాలంటీర్లు, సుందరరావు యింటికి వస్తారు.)

రామశాస్త్రి :— ఏమండీ సుందరరావుగారు! యెలాగుంది వొంట్లో ?

సుందర :— చాలా నీరసంగావుంది. రాత్రి కొంచెం నిద్ర పట్టింది. ఇప్పుడు ఆసుపత్రికి వెళ్లి కట్టు కట్టించాలి.

రామశాస్త్రి:— మీరు ఆసుపత్రికి వెళ్లకండి. మనపంతులు ధన్వంతరి యిప్పుడేవస్తాడు. వారు మందువేసి బాగుచేస్తారు. నేను వారితోమాట్లాడేను. ఈఆసుపత్రి డాక్టరుగారికి గొంతుక్కు-మాడిలేదు. ఆశకు అంతంలేదు. బీద-సాద-కష్టం-సుఖం-మంచి-

చెడ్డ, వారి జీవితంలో వున్నట్టు కనపడవు. కర్రముక్క దగ్గర నుండీ కర్పూరం కొనుక్కున్నా కర్తే. యెంతసేపూ 'డబ్బు, డబ్బు, డబ్బు' తప్ప వేరే లోకమేలేదు.

సుశీల :— శాస్త్రిగారూ! నిన్న మీటింగులో మానాన్న గారి జేబులోని మంగళసూత్రాల పొట్లాం, యెలాగో, యెక్కడో పోయిందండీ!

రామశాస్త్రి :— ఆఁ! మంగళసూత్రాలా!

సుందర :— (తలవంచుకుని రెండుచేతుల్లో బుర్రపెట్టుకుని) నిన్న ఉదయం మాఆవిడ మంగళసూత్రాలను తీసుకుని పొట్లాం కట్టి అమ్ముదామని జేబులో పెట్టుకున్నాను. బజారులో చూపించి తూపించేను. అరతులంవుంది. మేలిమికాదు, ఇరవై రూపాయిలు యిస్తామన్నారు. ఇష్టపడక జేబులో పెట్టుకుని మీటింగులోకి వచ్చేను. నిన్నసాయంత్రం చూచేసరికి జేబులో లేదు.

వాలంటీర్లు :—శాస్త్రిగారూ! పోలీసుకురిపోర్టు చేద్దామండీ.

రామశాస్త్రి :— ఏంలాభం? మనకంటె గర్భదరిద్రు డెవడో వాటిని దొంగిలించి వుండాలి. మనం రిపోర్టుచేస్తే, పోలీసులు కష్టపడి, వెదకి పట్టుకుంటారు. గాని ఆసొత్తు, ఆ దరిద్రులకూ వుండదు. మనకూ రాదు. మనసొమ్మయితే, మన కష్టార్జితమయితే దానంతట అదేవస్తుంది.

పిల్లడు :— అమ్మా! అమ్మా! ఆకలే, అన్నంపెట్టే.

కాంతం :— ఈ పరిశ్రముల కడుపున యెందుకువ్పుట్టేవురా నాయనా ? పిల్లవాడికి పిడికెడు అన్నంపెట్టలేని జన్మ, యేంజన్మ? పాపిష్టిజన్మ. దినదిన గండం దీర్ఘాయుష్షు. ఇదేమి పరిపాలనో కూడు, గుడ్డలేని పరిపాలన. గుడ్డిపరిపాలన. అమ్మా ! సుశీలా! అల్లాసజ్జలో కందమూలందుంప వుండాలి. పీడికియ్యి.

రామశాస్త్రి :— అమ్మా ! విచారించకండి. యేంచేస్తాం. దేశం బాగుపడితేనేగాని, ప్రజలు బాగుపడరు. ప్రజలు బాగుపడితేనేగాని దేశంబాగుపడదు. అందుకనే అన్నాడు గురజాడ అప్పారావు "దేశమును ప్రేమించవోయి" అని.

కాంతం :— యేమిదేశమో, యేమిప్రజలో అన్నవస్త్రాలకి అల్లల్లాడి పోతున్నాం. యెప్పటికైనా, యీ కరువునుండి బయటపడి కడుపునిండా తిండితింటామా అని అనిపిస్తోంది.

రామశాస్త్రి :—అన్యాయకాలందాపరించింది. యేంచేస్తాం. త్వరలోనే మంచిరోజులు రావచ్చు. నేను యింటికివెళ్ళి కొంత సొమ్ము పంపుతాను. తరువాత మనం చూసుకుందాంలెండి.

సుందర :— తరువాతమాత్రం యెలాతీరుస్తాం. తీర్చడాని కేమీ ఆధారం, దారి, తెన్ను కనపడదు. వద్దండి.

రామశాస్త్రి :— సుందరరావుగారూ ! నా దోమనవి. కొన్నాళ్ళవరకు నేనుచెప్పినట్లు మీరువినాలి. నడుచుకోవాలి కూడాను.

జోగమ్మ :— అన్నయ్యా ! వారుచెప్పినట్లు చేయండి. భగవంతుడే వున్నాడు. వారిఋణం యెలాతీర్చుకుంటామో యెవరు చెప్పగలరు ?

రామశాస్త్రి :— సుందర్రావుగారూ! కదలకుండా పడుకోండి. నేనుసాయంత్రం గాని, రేపుగాని వస్తాను. నమస్తే.

వాలంటీర్లు :—

దేశమును ప్రేమించ వోయి
మంచి అన్నది పెంచుమోయి
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయి.
పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి
తిండికలిగితే కండకలదోయి
కండగలవాడేను మనిషోయి.
దేశాభిమానం నాకుకద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయి
పూని యేదైనాను వొకమేల్
కూర్చి, జనులకు చూపవోయి.
స్వంతలాభం కొంతమానుకు
పొరుగువారికి తోడుపడవోయి!
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులేనోయి.

(అనిపాడుతూ నిష్క్రమింతురు.)

---

# 5 వ రంగం

[ కాంతం, సుశీల, శంకర్రావు, జోగమ్మ ప్రవేశింతురు ]

కాంతం :— వోరే, శంకరం! పిల్లలాకలితో చుట్టుకు పోతున్నారు. నువ్వలా కూర్చుంటే యెలా చెప్పు? ఆ బరంపురం అన్నంగిన్నె, ఆ కంచుమరచెంబూ తీసుకొనివెళ్ళి, యెక్కడేనా తాకట్టుపెట్టో, అమ్మేసో — ఇన్ని నూకలు తెస్తేనేగాని దినం దిబ్బెక్కదు. నాన్నగారు నడిచి వెళ్ళలేరు కదా! కావలిస్తే మీఅత్తను తీసుకువెళ్ళు.

శంకరం :— అమ్మా నేను వెళ్ళలేను. చెంబు, తప్పేలా మోసుకుపోయి "మీ రిస్తారా? మీ రిస్తారా? అని ప్రతీ గుమ్మంయెక్కి దిగలేను. నాకు తిండి అక్కర్లేదు. ఉపవాసం వుంటాను.

జోగమ్మ :— అలాగంటే యెలాగురా శంకరం? నువ్వూ నేనూ వుపవాసంవుంటే మిగతావాళ్ళో? నే నవి పట్టుకుని నీ వెనకాలవస్తా అయిళ్ళు నాకు చూపించు. మిగతాపని నేను చేస్తా.

శంకరం :— అత్తా! తప్పేలా ముంతా తాకట్టు పెట్టి యెంతకాలం తింటాం? ఆ రెండిటితోటీ మనదరిద్రం పోదే. అలాంటిపని నాకిష్టంలేదు. తిండిలేకపోతే కొంపకి నిప్పు పెట్టేసుకుని, అంతా వొక్కమారు చచ్చిపోదాం. దానితో మన

కరువుకూడా చచ్చిపోతుంది. అంతేగాని, మనదరిద్రాన్ని బజా రులో పెడితే యేంలాభం? మనదరిద్రం అంతా వాళ్ళదగ్గిర వెళ్ళబోస్తే, అంతా విని "1-4-0 శేరుబియ్యం, చచ్చిపోతు న్నాం. యెక్కడా యెర్రని యేగానిలేదు." అని లక్షాధికారికూడా మనదగ్గిర యేడవడం ప్రారంభిస్తాడు. దేశంలోను, ప్రజల్లోను, లంచగొండితనం, ధనాశ, మోసం పెచ్చుపెరిగిపోయాయి. వొద్దత్తా, వొద్దు. యీపనివొద్దు. నేనురాను.

సుశీల :— అత్తా! నేను వస్తాను పద. యెవరినేనా బజా రులో అడిగితే వాళ్ళే చెపతారు. అన్నయ్యకు చదువు,యిల్లుతప్ప వేరే లోకంలేదు. తప్పేలాయింత పట్టుకొని బజారుకు వెళ్ళడం నామోషి.

జోగమ్మ :— రామ్మా, రా! మీ అమ్మనడిగి ఆచెంబూ, గిన్నె యివతలపెట్టు. బట్టకట్టుకువస్తా.

సుశీల :— అమ్మా! అవేవో యియ్యి, నేనూ అత్తా బజారు కెళ్ళి సామాను తెస్తాం.

కాంతం :— (దేవుడి గదిలోకి వెళ్ళి మహాలక్ష్మికి నమస్క రించి) తల్లీ మహాలక్ష్మి! నిన్నెంతవేడినా లాభంలేదు. నిన్నెంత ప్రార్థించినా ఫలం లేకపోయింది. ఈరోజుతో నీకూ - నాకూ ఋణానుబంధం తీరిపోతున్నాది. నీవు మహాపాపాత్ముల పంచ ల్లోను, లంచగొండిదార్ల యిళ్ళల్లోను, మహాలోభుల పిడికిళ్ళ లోను, బ్లాకుమార్కెట్టుదార్ల పెట్టెల్లోను, యిహాస్తా పరస్తా

యెవరూలేని యొుండి మొాడు మనుష్యుల చేతుల్లోను పడి పోయావు. ఇనప్పెట్టెల్లో నిన్ను దృఢంగా బంధించేస్తున్నారు. నీకు స్వేచ్ఛలేదు. ఏమిచేయగలవు? కష్టపడి పనిచేసేవారికి నీవు అపురూపంగా దొరుకుతావు. అంతలోనే మాయమవుతావు. నిన్ను నవలసిన పనిలేదు. కడుపునిండా - కడుపునిండా యేమిటి? ప్రాణాలు నిలబెట్టుకోడానికి కూడా పేదవాడికి తిండి కరువై పోయింది. లంచగొండితనం, ధనాశ, మితిమీరి పోవడంచేత చీకటిబజారులో యీ కరువు కాటకాలకు కాళ్ళొచ్చాయి - హా దేవీ! యెన్ని పాపాలు చేసేమో? యెంతమందిని బాధించి కడుపుమీద కొట్టేమో? మాకీగతి పట్టింది. దరిద్రంతోను - అవమానంతోను మమ్మెందుకిలా బాధిస్తావు? వొక్కసారి పిడుగు మామీదపడి. అమ్మా, మహాలక్ష్మి! నీపూజకు నీళ్లు తెచ్చే చెంబు, నీనై వేద్యానికి వండేగిన్నె, యీదినం నిన్నూ - నన్నూ విడిచి బజారుకుమ్మెం పడుతున్నాయి. మా జీవాలు గంటలను లెక్కపెడుతున్నాయి. నీకూ, నాకూ ఋణాస్యతీరి పోయింది. వోదీపమా! యెందుకలా కునుకుతూ మాలాగే వుంటావు? ప్రళయకాల బడబాగ్నివయి, ఆకలితో చుట్టు కొని పోతూన్న యీ పాపిష్టికుటుంబాన్ని, యీ దరిద్రనారా యణ జట్టుని, నీపొట్టలో పెట్టుకుని, ఆ మహాలక్ష్మి సన్ని ధానంలో జాజ్వల్యమానంగా వెలుగుతూ వుండు తల్లీ! ఇదే నా ఆఖరు నమస్కారం.

(అని చెంబు గిన్నె పట్టుకునివచ్చి సుశీలకిచ్చును)

సుశీల :— అమ్మా! వూరుకోవే. ఇప్పుడే బజారుకెళ్ళి సామానులు తెస్తాం. (నిష్క్రమింతురు)

(బజారువీధి - జోగమ్మ సుశీల)

జోగమ్మ :— (బజారులో) యేమండీ, ఇక్కడిసామాను తాకట్టువట్టేవా రెక్కడున్నారండీ?

ఒకడు :— అదేమో యెవరికి తెలుసు? అలాపో.

సుశీల :— (ఇంకా కొంతదూరం వెళ్ళి) యేమండోయి! యీసామాన్ని కొనుక్కునేవా రెక్కడున్నారండీ?

బట్టల దుకాణదారు :— మీదేవూరు?

సుశీల :— ఈవూరే.

బట్టల దుకాణదారు :— ఈవూరైతే తెలీదు?

సుశీల :— తెలీదండీ. యెప్పుడూ అమ్మలేదు - రాలేదు- చూడలేదు.

బట్టల దుకాణదారు :— యెందుకమ్మేస్తున్నారు?

సుశీల :— తిండికోసం.

బట్టల దుకాణదారు :— వాటికేంవస్తుంది, యేంతింటారు?

సుశీల :— వచ్చినంతే చాలు. యేంచేస్తాం, యీపూట గడుస్తుందికదా, రాత్రికి భగవంతుడే వున్నాడు.

బట్టల దుకాణదారు :— మీరెవరు బ్రాహ్మలా?

సుశీల :— అవును.

బట్టల దుకాణదారు :— బ్రాహ్మలకెక్కడలేనిదీ తిండికే చాలదు. దేశాన్ని, దేవుణ్ణే తినేసినా ఆకలే.

సుశీల :— (కోపంగా) ఇంగతావాళ్ళు, దేశాన్ని, దేవుణ్ణి మోసంచేసి, చీకటిబజారులో పెట్టి, సంపాదించిన సొమ్మును కట్టుకున్న పెళ్ళాం పిల్లలకేనా పెట్టక, కనుపుమాడ్చుకుని సీలు చేసి దాచుకుంటారు. బ్రాహ్మలు సంపాదించుకున్నది తినేస్తారు.

జోగమ్మ :— అమ్మాయీ! వారితో మనకేంపని? రా పోదాం. అడిగినదానికి జవాబులేక అడ్డమైన మాటలూ ఆడుతున్నారు. పదా!

బట్టల దుకాణదారు :— యేమమ్మా! బోడెమ్మా! బ్రాహ్మల కీపొగరింకా పోలేదూ!

జోగమ్మ :— పోయింది నాయనా, పోయింది. పూర్తిగా పోయింది. మాలపిల్ల సినీమాతో కొంతమాయమయింది. మిగిలింది హరిజన ప్రవేశంతో అడుగంటిపోయింది. మీరెవరు బాబూ?

బట్టలదుకాణం :— మేమా, మేమా, నాయుళ్లం.

జోగమ్మ :— యే నాయుళ్లు?

బట్టలదుకాణం :— నాయుడు తెగలెన్నున్నా యేమిటండీ!

జోగమ్మ :— తెలగా నాయుడు, మాలనాయుడు, . . . ఇలా గివుడెన్నో వున్నాయికదూ! ఆవర్గంలో మీరెవరండీ?

కిరాణీ దుకాణదారు :— వెళ్లండమ్మా వెళ్లండి. అతనితో మీకెందుకు? యేమయ్యాయి, ఆ అమ్మగారడిగింది మీకు

తెలిస్తే చెప్పాలి. లేకపోతే మానివాలి. నీవొక్కమాట బ్రాహ్మల్నంటే యెంతమంది నాయుళ్లు బయటపడ్డారో చూడు. బ్రహ్మద్వేషం, అన్నద్వేషం వుండకూడదు.

బట్టల దుకాణదారు :— మహా న్యాయం చెప్పేవు! ఈ బ్రాహ్మలవల్లే దేశానికీగతిపట్టింది.

కిరాణీ దుకాణదారు :— బ్రాహ్మలవల్లకాదు. బ్రాహ్మణేతరుల వల్లనే దేశంచెడింది. పంచాయితీబోర్డు మెంబరు మొదలు, పార్లమెంటు మినిష్టరుదాకా చూడు. యేబ్రాహ్మడు లంచంపుచ్చుకున్నాడు? యేబ్రాహ్మడు పర్మిట్లు సంపాదించి యిల్లు నింపుకున్నాడు. యెవరు లంచంతిన్నారో, యెవరులేదో మద్రాసు మినిష్టరీకేసు రుజువుపరిచింది కదూ! బ్రాహ్మలనన్నవారు పాపానపోతారు. మనమే, మనవాళ్ళడబ్బును బ్లాకులో దోచుకుంటున్నాం.

బ. దుకాణ :— నువ్వుదోచుకుంటున్నావు గాని, మరెవరూ దోచుకోలేరు.

కి. దు. :— నీవు చేస్తూన్నదేమిటో? మిల్లుబట్టల బేళ్ళను దాచి, అడ్డమడ్డగా అమ్మి, నల్లవ్యాపారం చేస్తూ నన్ను దబాయిస్తున్నావు? చాలు, చాలు.

బ.దు.:— నీలాగు నేను బియ్యం బస్తా 86-0-0 లకు అమ్మలేదే!

కి. దు. :— నాకోసం అమ్ముతున్నాననుకున్నావా? అధికార్లకోసం - పై వారికోసం.

బ. దు. :— నేనూ అంతే పైవారికోసం ప్రజోపకారం కోసం.

జోగమ్మ :— యెందుకండీ మీరు దెబ్బలాడుకుంటారు ? మీతప్పులేదు. అధికారులు, పోలీసువారు, అంగీకరించారు కాబట్టే అన్నవస్త్రాలు చీకట్లో చిందులుతొక్కుతున్నాయి. పేదసాదల పొట్టలు పీక్కుపోతున్నాయి, పోయివస్తాం.

(జోగమ్మ - సుశీల బజారులోంచి కొంతదూరం వెళ్ళి వాకరి గుమ్మం యెక్కి)

జోగమ్మ :— సత్తెయ్య దెట్టిగా రున్నారండీ ?

సత్తెయ్య :— యెవరుమీరు, యేంకావాలి ?

జోగమ్మ :— ఈ తప్పేలా కుంత వుంచుకొని పదిరూపాయిలు యిప్పించుదురూ!

సత్తెయ్య :— మీదేవూరు ?

జోగమ్మ :— ఈ వూరేనండి.

సత్తెయ్య :— యేం చేస్తున్నారు ?

జోగమ్మ :— మాఅన్నయ్యగారు గుమాస్తాగావున్నారు. ఈమధ్య దెబ్బతగిలి లేవలేకుండా మంచంపట్టేరు.

సత్తెయ్య :— యేం దెబ్బతగిలిందమ్మా ?

జోగమ్మ :— అదేదో దిక్కుమాలిన మీటింగు యీమధ్య యీవూళ్ళో జరిగింది. దాల్లో తలపగిలింది.

సత్తెయ్య :— అతడా ? సుందర్రావుగారు, అతడేనా ?

జోగమ్మ :— అతడే, మీకు తెలుసునా ? మా అన్నగారే. అతనికూతురే యీపిల్ల.

సత్తెయ్య :— అతనిది యీమధ్య బంగారం కొంతపోయిందటగా ?

జోగమ్మ :— అవును, దరిద్రదినాలు.

సత్తెయ్య :— ఇదిగో యీ 5/రు. తీసుకు వెళ్ళండి. ఇవి చాలా పాతవి.

జోగమ్మ :— అవును, మా ముత్తాతగారి సంసారానికి కొన్నవట. 5. రు. చాలవండి. బియ్యానికేనా చాలవు. పది రూపాయలు యిప్పించండి దిక్కుమాలిన కరువు, దినదినమూ పెరిగిపోతున్నాది.

సత్తెయ్య :— (ఆలోచించి) అమ్మా ! యిదిగో 10-రు. నెలకు 1—4—0 వడ్డీ అవుతుంది.

జోగమ్మ :— సరే యేంచేస్తాం - ఆపదకి అడ్డుపడ్డారు. ఈవూళ్ళో మీదే ధర్మవడ్డీ అని చెప్పేరు. వచ్చేనెల్లో విడిపించేస్తాం.

సత్తెయ్య :— అందరూ అలాగే అంటారు. అదుగో అటు చూడండి. ఆమూడుగదుల్లో సామానులు యిలాంటి బాపతులేను.

సుశీల :— కరువుకుటుంబాలన్నీ మీ గదుల్లో కాపురం వున్నాయన్నమాట.

సత్తెయ్య :— ఆపదకి అడ్డుపడకపోతే వాళ్ళగతి యేమవుతుంది ?

సుశీల :— ఈబజారులోనే అల్లక్కడ - వో బట్టలదుకాణ దారూ, వో కిరాణీకొట్టుదారూ మీలాగే ప్రజోపకారానికి, అధికార్లను పోలీసులను దగ్గర పెట్టుకుని అన్నవస్త్రాలిచ్చి ప్రజలకు సహాయం చేస్తున్నారట. మీబోటివాళ్ళుండబట్టే మనదేశం...........

జోగమ్మ :— చెట్టిగారూ? వస్తామండి.

సత్తెయ్య :— మంచిది. (నిష్క్రమింతురు)

---

6 వ రంగం

••••o•o••••

(సుందర్రావు యిల్లు)

మోహనరావు :— శంకరం! శంకరం!

సుశీల :— యెవరువారు?

మోహనరావు :— నేను మోహనరావును. శంకరం వున్నాడా?

సుశీల :— వుండండి - చూచివస్తాను. (అనివెళ్ళి తిరిగివచ్చి) వున్నాడండి రూములో - రమ్మన్నాడు.

శంకరం :— గుడ్‌మోర్నింగ్ మోహన్.

మోహనరావు :— మీనాన్నగారెక్కడవున్నారూ?

శంకరం :— రా, వరాండాలోవున్నారు.

మోహనరావు :— నమస్తే, సుందర్రావుగారూ! నేను రామశాస్త్రిగారి అబ్బాయినండీ. మానాన్నగారు మీకు యీ కవరిచ్చిమన్నారు. (అని అందించును)

సుందర్రావు :— బాబూ! నా నమస్కారాలు వారికందించు. వారిఋణం తీరుస్తానో, తీర్చలేనో ?............ కాంతం, కాంతం! వో శంకరం! మీ అమ్మనోమారు యిలా రమ్మను. రామశాస్త్రిగారి అబ్బాయివచ్చేడు అని చెప్పు.

(శంకరం లోనికివెళ్ళి తల్లిని తీసుకువస్తాడు)

కాంతం!

కాంతం :— ఆఁ!

సుందర్రావు :— ఇదిగో! .. ... రామశాస్త్రిగారు, వారి అబ్బాయిద్వారా శకిమానం వంపించేరు.

కాంతం :— శకిమానాలు దొరికే యేవిటండీ ?

సుందర్రావు :— అదికాదే. వెర్రిదానా. నూరురూపాయీలు యిచ్చి పంపించేరు.

కాంతం :—యేమెూ మీనోటివాక్యాన అవికూడా దొరుకుతాయేమో ?

సుందర్రావు :— ఏమో! భగవద్విలాసం. అబ్బాయీ, నీపే రేంపేరు ?

మోహన :— మోహనరావు.

సుందర్రావు :— యేం చదువుతున్నావు ?

మోహన :— మీ శంకరం, నేనూ, ఫిప్త్ఫారం కలిసిచదివేవండి. తరువాత స్కూలుఫైనలు ప్యాసయి, రైల్వేలో ప్రవేశించాను. 90-0-0 రు. యిస్తున్నారు.

సుందర్రావు :— మీ కెంతమంది అన్నదమ్ములు?

మోహన :— నేనే పెద్దవాణ్ణి, చిన్నవాణ్ణిన్నీ. తొమ్మిదేళ్ళ సిస్టరొకర్తెవుంది. ఫస్టుఫారం చదువుతున్నాది.

సుందర్రావు :— సుశీలా! మీ అత్తని కొంచెం వేణ్ణీళ్ళు, తెమ్మను.

(వేడినీళ్ళతో జోగమ్మ ప్రవేశించును.)

ఇతడు మనరామశాస్త్రిగారి అబ్బాయి. మోహనరావు. స్కూలుఫైనలు ప్యాసయి రైలులో 90-0-0 రు. తెచ్చుకుంటున్నాడు.

జోగమ్మ :— రామశాస్త్రిగారి కుటుంబం సాంప్రదాయ కుటుంబం. పిల్లలు రత్నాలు. ఆ అణకువ, ఆ శాంతం, ఆ చురుకుదనం, ఆ మర్యాద—

సుందర్రావు :— తండ్రి పేరు నిలబెడతాడు.

జోగమ్మ :— అబ్బాయీ! నీకు పెళ్ళయిందా?

మోహన :— లేదు.

జోగమ్మ :— మా శంకరానికి కూడా యీనెల్లో వుద్యోగం అవుతుంది. ఈపిల్ల శంకరం చెల్లెలే. అదేదో ఆ పేరు నాకు రాదు. ఫస్టు ఫారం చదువుతున్నాది.

మోహన :—సుందర రావుగారూ ! నేను వెళ్లివస్తానండి. శంకరం ! మా యింటికోమాటు రావోయి.

సుందర :—ఇదిగో, మోహనరావ్గా ! అప్పు డప్పుడు వోమాటు వస్తూవుండు.

మోహన :—అలాగే. (నిష్క్రమించును)

చంద్రుడు :—సుందర్రావుగారూ !

సుందర్రావు :—యెవరది ?

చంద్రుడు :—నేను చంద్రుణ్ణి.

సుందర్రావు :—రండి, రావచ్చు.

చంద్రుడు :—యెలాగుందేమిటి ? మీకు దెబ్బతగిలిననాడే నేను వూరికి వెళ్లవలసివచ్చింది. యిప్పుడే బస్సులోవచ్చేను.

సుందర :—కొంచెం సంపాదిగావుంది. మన పంతులు ధన్వంతరిగారే మందు యిస్తూన్నారు మనకు దేవుడులాగ ఆయన దొరికేడు. లేకపోతే, యీవూళ్లో ఈకాలంలో మన జీతాలకు డాక్టరును పెట్టుకోవడం, మందులు కొనుక్కోవడం, మనతరమా? నాకు దెబ్బతగిలిన రోజున మీరునాకు చేసిన మహోపకారాన్ని యీజీవితంలో మరవలేను. రామశాస్త్రి గారు అంతా చెప్పేరు.

చంద్రుడు :—అదిమహోపకారంయేమిటండీ, వొకరికొకరు సహాయంచేసుకోవడం ? అది మావిధి; ధర్మమునూ్న. మీ రలా అనడం భావ్యంకాదు.

సుందర్రావు :—కాంతం, ఇదిగో చంద్రుడుగారు వచ్చారు.

కాంతం :— (లోపలికివెళ్లివచ్చి) ఆరోజున మీరు మా పాలిటి దేవుడులాగ వచ్చేరు. డాక్టరుగారికి సొమ్మిచ్చి, కట్లు కట్టించి, యింటికి పంపించేరు ఇదిగో యీ 10/రు నోటు. ఆరోజున యెంతఖర్చయిందో తీసుకోండి బాబూ!

చంద్రుడు :—వుంచండమ్మా, వుంచండి. తరవాత యిద్దురుగాని లెండి. నేను సుందర్రావుగారివద్ద యింతకు రేట్టింపుగా పుచ్చుకుంటాను. సుందర్రావుగారూ! ఆరోజున మీతాలూకు మంగళసూత్రాల పొట్లాం పోయిందని యిప్పుడే మాబావ రామశాస్త్రి చెప్పేడు. అదిమీదా?

కాంతం :—దొరికిందేమిటి?

చంద్రుడు :— ఆఁ. ఆవేళ సుందర్రావుగారిని అసుపత్రిగేటు వద్ద జట్కాసుండి దింపుతూన్నప్పుడు, వో పొట్లాం కిందపడింది. దానిని నేనుతీసి, యేమిటో తరువాత చూదామని జేబులో పడేసుకున్నాను. నేనూ వెంకటేశం సుందర్రావుగారిని పట్టుకుని ఆసుపత్రిలోకి తీసుకువెళ్ళేం. కట్టుకట్టించేం. ఇంటికి పంపించేశాం. అంతలోనే బస్సురావడంవల్ల, ఆ బస్సులో నేను వూరికి వెళ్ళిపోయాను. బస్సులోకూర్చుని జేబులు తడుముకుంటూంటే, యీ పొట్లాం కనపడింది. విప్పిచూచేను. నిర్ఘాంతపోయేను. ఇవి యెవరివై వుంటాయి? సుందర్రావుగారివా? లేక, జట్కాలో యెవరేనా, మరచిపోతే, యిప్పుడు కిందపడ్డాయా? అని చాలా సేపు ఆలోచించాను. ఏమీ పాలుపోలేదు. ఇప్పుడింటికివచ్చి

మాబావని, సుందర్రావుగారి కెలావుంది? అని అడిగేను. ఈ సంగతంతా చెప్పేరు.

కాంతం :— మీరూ, మీభావగారూ మా కుటుంబానికిచేసిన సహాయానికీ, చూపినదయకు మే మేంచేయాలో తోచటంలేదు.

వెంక టేశం :— (ప్రవేశించి) శంకర్రావ్, శంకర్రావూ!

శంకర్రావు :— యేమిరోయి వెంకటేశం. రా. చంద్రుడుగారూ యిక్కడేవున్నారు.

వెంకటేశం :— చంద్రుడూ, యెప్పుడొచ్చేవోయి, వూరినుండి.

చంద్రుడు :— ఇప్పుడే, వో గంటైంది — కూర్చో! వొరే చూడూ! నీకుజ్ఞాపకంవుందీ? సుందర్రావుగార్ని ఆసుపత్రి దగ్గిర, జట్కాలోంచి దింపుతూవుంటే, వో పొట్లాం కిందపడింది.

వెంక :— అవు నవును. అ దేమిట్రా అని అడుగుదాం అనుకున్నాను. మరినీవు కనపడలేదు.

చంద్రుడు :— అవి పిరితాలూను మంగళసూత్రాలు.

వెంక :— విన్నవిన్నానురా, పిరిబంగారం పోయిందని.

చంద్రుడు :— నే నింటికిరాగానే యీా సంగతి తెలిసింది. చక్కావచ్చేను. ఇదిగో, ఆ పొట్లాం, (అని పొట్లాం సుందర్రావుగారికిచ్చును)

వెంకటేశం :— కష్టార్జితం, యెక్కడికిపోతుంది?

చంద్రుడు :— వెంకటేశం! యేమిటి విశేషాలు?

వెంకటేశం :— యేమీలేదు. ఆఫీసుకి వెళ్ళేను. టపా చూచేసరికి అందులో యీ శంకర్రావుకు ఉద్యోగం ఆర్డరు వచ్చివుంది. యీ సంగతి చెబదామని యిలా వచ్చేను.

సుశీల :— (పరుగు పరుగున లోపలికిపోయి) అమ్మా అమ్మా! అన్నయ్య కుద్యోగం అయిందటే. ఆర్డరు ఆఫీసుకు వచ్చిందట. అల్లా వేంకటేశంగారు, చంద్రుడుగారితోటీ, నాన్న గారితోటీ చెపుతున్నారు.

కాంతం :— ఉద్యోగం అయిందీ! మహాలక్ష్మితల్లీ! (అని కాంతం చావిట్లోకి వచ్చును)

వెంకటే :— మీ శంకరానికి వుద్యోగం అయిందండీ.

కాంతం —: ఏదో ఆ దేవుణ్ణేనమ్ముకున్నాం. నీటముంచినా పాలముంచినా వాడే

సుందర్రావు :— ఆ దేవుడు గుమస్తాలను నీళ్ళలోనూ ముంచడు, పాలలోనూ ముంచడు. నీళ్ళపాలలో ముంచుతూ వుంటాడు.

చంద్రుడు :— భగవంతుడు, జీవిని కష్టసుఖాల్లో ముంచేత్తుతూ వుంటాడు.

వెంకటేశం :— చీకటి లేని వెలుతురూ, వెలుతురు లేని చీకటీ సుఖదాయకం కాదు.

చంద్రుడు :— సుందర్రావుగారూ! వెళ్ళివస్తాను.

వాలంటీరు :— (ప్రవేశించి) సుందర్రావుగారూ! సత్తెయ్య చెట్టిగారు, యీ బరంపురంగిన్నె, యీ మరచెంబు, తమకు

పంపించమని శ్రీరామశాస్త్రిగారి యింటికి పంపించేరు. వీటిని శాస్త్రిగారు మీకిచ్చిమన్నారండి.

సుందరరావు :— అక్కడ పెట్టునాయనా! — హా! దైవ సంకల్పం. సంపద, సంపదను — విపత్తు, విపత్తును అనుసరించి నడుస్తాయి. మీరందరూ గాఢాంధకారంనుండి యీ కుటుంబాన్ని వెల్తురులో పడేశారు చాలాసంతోషం.

వెళ్ళి వస్తామండి. నమస్తే జైహింద్.

అని ( అందరూ నిష్క్రమింతురు )

---

## 7 వ రంగం

•••○•••

[జోగావధానులు, నారాయణావధానులు. విజయనగరం రైలుప్లాటు ఫారంమీద కూర్చుని]

నారాయణావధాని :— యేమిరోయి జోగన్నా! యెందాక యీప్రయాణం? ఈమధ్యనీవు సింహాచలక్షేత్రానికి వెళ్ళేవట. యేం విశేషం?

జోగావధాని :— ఏముంది నారాయణా! మామూల్నాలే. వోమాటు స్వామిదర్శనం చేద్దామని వెళ్ళేను.

నారా :—అక్కడ పూర్వంలాగేవుందా? యేమేనామార్పు లున్నాయా ?

జోగా :— మనం అవధానుల వాళ్ళం. వైదికులం. కాబట్టి అనుకోవలసినవి వొకటి రెండు మాత్రం వున్నాయి.

నారా :— యేదో పెద్ద మార్పుంటేనే గాని నీముఖతః రాదు. చెప్పు – చెప్పు. రెండు బళ్ళు యిక్కడే వ్రాసింగు. ఇంకా చాలా టైముంది.

జోగా :— సింహాచల దేవస్థానం, విజయనగరం మహారాజా వారి సర్వాధికారంలో వున్నప్పుడు, అప్పటి హవల్దారులు వైదికంలోనూ, లౌక్యంలోనూ ఆరితేరినవారై యుండేవారు. ఇప్పుడు, యెండోమెంటు బోర్డు అధికారం కిందకి రాగానే, ఆ వోల్డుమోడలు హవల్దారులు కనపడ లేదు. వారిస్థానే కొత్తగా అదోరకం, ఫిఫ్టీమోడలు హవల్దారులు వచ్చేరు.

నారాయ :— బోర్డుపరిపాలన, రోడ్డు మరామత్తు లాంటిది. అభిమానాశ్రయాలపై ఆధారపడివుంటుంది.

జోగా :— ఈచిత్రంవిన్నావా ? సింహాచలంలో భోగాలు ఆకుల్లోపెట్టి యిస్తూవుండేవారు కదూ ? ఇకపైని అలాయివ్వరట. పులిహోర, పొంగలి, దధ్యోదనం వగైరాలను వేరువేరుగా ఆకుల్లోవేసి, కాగితాల్లో బిస్కత్తుపొట్లాల్లాగ పేకు చేసి, వాటిమీద లేబిల్సు అంటించి, వెలవేసి, అమ్ముతారట. ఇది యెండోమెంటుబోర్డు యినస్పెక్టరుగారి సలహాట.

నారాయ :— మంచిదే. చాలాబాగుంది. ఆపాట్లంమీద అడ్రసురాసి అలాగే పోష్టులో పడేవచ్చు.

జోగా :— బాగాచెప్పావ్. విపరీతబుద్ధి.

నారా :— ఇంకేమిటి. యెక్కడికిలా బయలుదేరేవు ?

జోగా :— గునాస్తాసుందరరావుని యెరుగుదువు కదూ ! అతడి కుమారుడు శంకరరావుకి, మధురవాడ మధుసూదన రావుగారి మనుమరాలినిచ్చి వివాహం చేయడానికి పెద్దలు నిశ్చయించారు. మధుసూదనరావుగారింటికి వెళ్ళి, ముహూర్తంపెట్టి రావడానికని బయలుదేరేను.

నారా :— వాకేజోగన్నా ! మధుసూదన రావుగారు యేపాటివారు?

జోగా :— మధుసూదన రావుగారు 50, 60 వేల స్థితి పరులు. తోటలు, దొడ్లువున్నాయి. రొక్కం 30 వరకున్నూ వుంటుంది. లక్షాధికారి అనిచెప్పవచ్చును. అతనికొక్కర్తే కుమార్తె. ఆమె, యోఆడపిల్లను భూమిమీద పడవేసి, వెళ్ళి పోయింది. మధుసూదనరావే ఆపిల్లను పెంచి, పెద్దచేసేడు. ఆతని యావదాస్తీ ఆపిల్లదే. సింహాచలం కొండమీద పెళ్ళిచేస్తాడు.

నారా :— అదికాదోయి నేనడిగింది? మనబోటి పండితులకు సత్కారాలకు అతనేపాటివాడు?— అని.

జోగా :— అదా !

శ్లో ఏకైక దుడ్డుః కుల పండితానాం
దుడ్డుద్వయం కుండల మండితానాం
యేగాని యేగాని కవీశ్వరాణాం

నారా :— చాలు చాలు తెలిసిపోయింది.

జోగా :— నారాయణా! నీవు గడుసువాడ వోయి. నా నోట అంతా పలికించేవు. నీవెక్కడికో, యేం పనిమీద వెడుతున్నావో చెప్పేవుకాదు కదా!

నారా :— నేనూ నీపనిలాంటి పనిమీదే బయలుదేరేను. సుందర్రావు కూతుర్ని —

జోగా :— గుమాస్తా సుందర్రావే! యిప్పుడు మామధు సూదనరావు గారికి కాబోయే వీరకాడే !

నారా :—ఆఁ! అవును. అతడే. అతని కూతురు సుశీలని దేశభక్త రామశాస్త్రిగారి అబ్బాయి మోహనరావు రైలులో 90/లు తెచ్చుకుంటున్నాడు— అతనికిచ్చి, సింహాచలం కొండ మీదే పెళ్లిచేయుడానికి నిశ్చయమైంది. ఆరామశాస్త్రిగారిని కలుసు కోవడానికి వెళుతున్నాను.

జోగా :—వోరే, నారాయణా! చాలా బాగుందిరా. ఇక్కడే వ్రాసింగు అన్నానుకదూ. రెండింటికి మనమిద్దరం హాజరు. వోరే, మనకవిని మ్రాత్రం యీపెళ్లిళ్లలో.

నారాయణ :—ఆమాట నాకు వేరేచెప్పాలా? అతడు లేక పోతే యీసాంసారిక నాటకమే లేదన్నమాట.

జోగా :—మంచిది. రైలువస్తున్నది. ముహూర్తం త్వరలో పెట్టు. (నిష్క్రమింతురు)

## 8 వ రంగం

(సింహాచలం కొండమీద సత్రం—సుందర్రావు కుటుంబం, రామశాస్త్రి కుటుంబం, మధుసూదనరావు కుటుంబం, బంధుమిత్రులు, జోగావధాని నారాయణావధాని, కవిపండితులు ప్రవేశింతురు.)

(సుశీలా మోహనరావులు - శంకరవర్ధనమ్మలు పెండ్లిపీటల మీదనుందురు.)

జోగా—నారాయణ :—శతమానం భవతి.... ప్రతితిష్ఠతి.

రామశాస్త్రి :—అమ్మా సుశీలా! మోహనరావూ! మీరుభయులు గార్హస్థ్యమును నిర్వహించుకుంటూ, దేశకల్యాణానికి పాటుపడుతూ, స్వార్థాన్ని పూర్తిగ విడనాడి, ప్రజోపకారానికి మీజీవితాలను వినియోగించి, శాశ్వతకీర్తి ప్రతిష్ఠలను సంపాదింతురుగాక! దేశానికి ఆదర్శప్రాయులగుదురుగాక! ఆపరమేశ్వరుడు మిమ్ములను రక్షించుగాక!

మధుసూదనరావు :—ఈ శుభసమయమున యీనూతన వధూవరులకు - దేశానికి నేనొక విన్నపం చేస్తున్నాను. యేమిటంటే -

నేను జన్మతః గర్భదరిద్రుణ్ణి. నాకు జ్ఞానం వచ్చిన తరువాత భగవత్కైంకర్యానికి పూనుకున్నాను. ఆ శ్రీహరి కరుణవలననో లేక, నాతల్లిదండ్రులు చేసిన సుకృతం వల్లనోగాని, పేరు ప్రతిష్ఠలతోపాటు పెద్ద ఆస్తినికూడా సంపాదించాను. చెప్పరానన్ని మహాపాపాలు చేసేను. అగ్నిసాక్షిగ పెళ్లాడిన నాపెళ్లాన్ని నానాబాధలు పెట్టి, హింసించేను. యెంతసేపూ ప్రజలను వంచించి, సొమ్ము సంపాదించడమే నాపని. శ్రీ సింహాచల స్వామివారి సమక్షంలో నామనుమరాలు చి. సౌ. వర్ధనమ్మను చి. శంకర్రావు కిచ్చి, ప్రాణిగ్రహణము చేయగనే నామనస్సు, దేశకల్యాణంకోసం పూర్తిగా మారిపోయింది. కామక్రోధాదులన్నీ అడుగంటి పోయాయి. నేను కొన్ని దినముల కంటె అధికంజీవించను. నేను అజ్ఞానంలోపడి కొట్టికుపోయి, ధనాన్ని, స్థిరాస్తులనూ కూడపెట్టేను. కాని నాకర్మఫలం యమునివద్ద అనుభవించేటప్పుడు యీ స్థిరచరాస్తులు, యీ ధనం, యీ దారాపుత్రాది బంధువులు, నాకు అడ్డుపడరు. దారాపుత్రాదులకోసం లోకంలో కష్టపడి, ధనంసంపాదించి, దాచినవ్యక్తి వొట్టిచవటపీనుగని యిప్పుడు నాకుబోధపడింది. యేజన్మలోనో చేసినపుణ్యలేశమువల్ల యిప్పుడు నాకు జ్ఞానోదయమయింది. నా అరవై వేల స్థిరచరాస్తులను లోకోపకారానికి, దీనజనోద్ధరణకి, విద్యావ్యాప్తికిగాను యీ నూతనదంపతుల పరంగా యిస్తున్నాను. ఈ యాస్తికి శ్రీసుందర్రావు బావగారు యజమానులై యుందురుగాక. అమ్మా, వర్ధనమ్మా!

ఇదిగో ముప్పదివేల రూపాయీల బ్యాంకుచెక్కు. దీనిని నీ యిష్టానుసారం ఖర్చుపెట్టుకొనుము. భగవంతుడు మిమ్ములను రక్షించి సన్మార్గమున నడిపించుగాక.

వర్ధనమ్మ :— తాతగారూ! నమస్కారం. మీ రిప్పుడిచ్చిన యీముప్పదివేల రూపాయల మూలధనంతో "గుమస్తానిధి" ని పెట్టుచున్నాను. గుమస్తాల కష్టసుఖాల కీ నిధి వినియోగపడ గలదు.

రామశాస్త్రి :— సెబాస్! వర్ధనమ్మా! పుట్టినింటికీ, మెట్టినింటికీ, కీర్తినీ, ప్రతిష్ఠనూ తెచ్చేవు. ఆపరమేశ్వరుడు మీదంపతులను ఆచంద్రార్కము రక్షించుగాక!

సుందర్రావు :— అమ్మా, వర్ధనమ్మా! నీ విశాలహృదయము కొనియాడతగినది. దేశమునందలి దుర్భిక్ష దారిద్ర్య నిర్మూలనానికి శ్రీమధుసూదనరావు బావగా రొసగిన ఆస్తిని వినియోగించి, ప్రజలకు సౌఖ్యానందములను కలిగించెదము గాక! భగవంతుడు మీదంపతులకు ఆయురారోగ్యములను, దేశాభిమానమును ప్రసాదించుగాక!

| | |
|---|---|
| మధు. | సర్వేజనాః సుఖినోభవంతు. |
| రామశాస్త్రి. | వందేమాతరం |
| సుందర్రావు. | జై హింద్ |
| కాంతం. | శ్రీ శ్రీ శ్రీ |

# గుమాస్తా

## ఇందువచ్చు పాత్రలు.

**పురుషులు**

సుందరరావు
వెంకన్న
వాలంటీర్లు
రామశాస్త్రి
డాక్టరు
వెంకటేశం
చంద్రుడు
ఆచారి
పిల్లడు
శంకరరావు
బట్టలదుకాణదారు
కిరాణీ దుకాణదారు
సత్తెయ్యశెట్టి
మోహనరావు
నారాయణావధాని
జోగావధాని
మధుసూదనరావు

**స్త్రీలు**

కాంతం
సుశీల
జోగమ్మ
వర్ధనమ్మ